అమెరికా దృష్టి
హిమాలయాల వైపు
మనదృష్టి
నయాగరా వైపు

ఇది నిజంగా
స్వర్గమే
ఇక్కడికి రావాలంటే
నరకం చూడాలి మరి!

అమెరికా
ఎంత గొప్పది!
ఎవరి జోలి వాళ్లది
ఎవరి జోలె వాళ్లది

అమ్మో
తెలుగు వాళ్లు!
తెనుగుదనానికి
తానా సభలు చలువ పందిళ్లు!





# అమెరికా! ఓ అమెరికా!

ఆచార్య మసన చెన్నప్ప

**AMERICA! O AMERICA!**
(Epigrams)

by

**PROF. MASANA CHENNAPPA,** M.A., M.Phil., Ph.D.
Dept of Telugu,
Osmania University, Hyd - 7



First Published : 2010

Price : Rs. 60/-

***For Copies***
**Prameela Prachuranalu**
'SHRESHTARAMAM'
9-76/2, Udayanagar Colony
Boduppal, Hyderabad - 500 039
Phone : 040-27201007

**Andhra Saraswatha Parishath**
Tilak Road, Hyderabad - 1

**Navoday Book House**
Kachiguda, Hyderabad - 27

Type Setting :
**Jagriti Graphics,**
3-4-228/4/1,
Lingampally, Kachiguda, Hyderabad-27

Printed at
**Mounica graphics**
1-4-27/71/187,
Padmashali Colony, Gandhinagar,
Hyderabad 500 080
Ph: 9391041545

# అంకితం



శ్రీ జి. ఉపేందర్ రావు గారు
బి.కాం.

అమెరికాలోని షికాగోలో జరిగిన తానా సదస్సు (2 - 4 జూలై, 2009) లో
ఆచార్య మసన చెన్నప్ప పాల్గొన్న దృశ్యం



# అమెరికా ఆకాశంలోంచి.....

- డా॥ ఎన్. గోపి

డా॥ మసన చెన్నప్ప మా మంచికవి, విద్వన్మణి, ఆర్షవిద్యాసంపన్నుడు అయినప్పటికీ నిత్యజీవితంలో బహుచమత్కారి. శబ్దచాలనంలో, ప్రాసలపూసలను గుదిగుచ్చటంలో సహజనిపుణుడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో దశాబ్దాలుగా అధ్యాపనం చేస్తున్న ఉత్తమ ఆచార్యుడు.

'అనగనగా ఒక చెన్నప్ప, అతడు అమెరికా వెళ్లాడు' అన్నట్టుగా కాకుండా అక్కడి నుంచి వేలాది అక్షరాలను మూటగట్టుకొచ్చాడు. అదీ నానీల రూపంలో. ఎప్పటి నుంచో అనుకుంటున్నాడు అమెరికా వెళ్లాలని. అక్కడ వారి పిల్లలున్నారు. ఇప్పటికి కుదిరింది. తానాలో కూడా పాల్గొన్నాడు. అమెరికాలో అడుగు పెట్టినప్పటి నుంచి ఒక గచ్ఛత్ వ్యాఖ్యాత లాగ అతడు నానీలను నలువైపులా వెదజల్లాడు. ఇప్పటికే ఒకసారి 'చెన్నప్ప నానీలు' రాసి తొలితరం నానీకవుల్లో స్థానం సంపాదించుకున్నాడు. మళ్ళీ నానీలు రాస్తాడని చెన్నప్పగానీ నేనుగానీ ఊహించలేదు. అదంతే, అలా జరిగింది. దీనికి నానీరూప విశిష్టతను కూడా మనం కాదనలేము. మొదటి నానీలోనే

"అమెరికా / అంటారేమిటి?

నాకు కావలసింది / భావాల అమరిక" - అన్నాడు.

'అమరిక' అమెరికాకు ప్రాసగా వచ్చినా అది ఎంతో అర్థవంతంగా కుదిరింది. అమెరికా ఒక వినిర్మిత సమాజం. Structured Society. ఒకచోటికి ఇలా తప్ప ఇంకోరకంగా వెళ్లలేం, ఒకపనిని అలా తప్ప మరోవిధంగా చెయ్యలేం, అమెరికాలోని infrastructure మహిమ అది. అయితే చెన్నప్ప కవిగా బాహ్యంలోని అమరిక మాత్రమే కాదు, భావాల అమరిక కూడా కావాలంటున్నాడు. మామూలు మనిషికీ కవికీ తేడా ఇక్కడే వుంటుంది.

ఎవ్వరైనా ఏదేశమేగినా తమదేశంతో పోల్చుకుంటూ చూస్తారు. అది అనివార్యం.

"నల్గురితో సుఖమా? / ఇండియాలో ఉండు

ఏకాంతవాసమా! / అమెరికాకు రా!"

అక్కడ ఎవ్వరికీ తీరిక ఉండదు. పర్యాటక వీసాపైన వెళ్ళినవారికి శని, ఆదివారాల సెలవుల్లో పిల్లలు తీసుకెళ్తేనే వెళ్లినట్టు. మిగతా ఐదురోజులు ఖైదు అన్నాడు చెన్నప్పే మరోచోట. ఎక్కడైనా వెలుగునీడలుంటాయి. మెచ్చుకోవలసిచోట కవి మెచ్చుకోకుండా వుండడు.

అదే కదండి / అమెరికా ఘనత"

చెన్నప్ప ఆర్యసామాజికుడు. రుషి ప్రోక్తాన్ని ఆపోశనం పట్టినవాడు. అక్కడికి వెళ్లి భారతీయతను వెతుకుతాడు.

"పై పై మెరుగులే / అమెరికన్లవి
ఆత్మలోకి చూసే / కన్నులు మనవి"

అంటూ మన అంతర్ముఖత్వాన్ని కొనియాడుతాడు.

చెన్నప్ప ఏది చెప్పినా అలవోకగానే చెప్తాడు. అతని శైలి ధారాళసుందరం, హేరాళబంధురం. ఇందలి నానీలన్నీ అద్దాలరవికలో ప్రతిఫలించే అపరంజి దృశ్యాలు.

"క్యారే / ఎంతమంచివారే!
ఇక్కడ ఎవరికివారే / నయాగరా తీరే!"

నాలుగో లైను దేనికి సామ్యమో (Analogy) చెప్పాలా! ఇట్లాంటి చమక్కులెన్నో ఈ నానీల్లో కనిపిస్తాయి.

"సూరీడు / భరతమాత నుదిటిబొట్టు
అతడిక్కడ / కనిపిస్తే ఒట్టు" - అదీ సంగతి!

అక్కడ కొంచెం ప్రకాశసూర్యుడు కనిపిస్తే టీవీలన్నీ ఊదరగొడుతుంటాయి.

"అమెరికాను గూర్చి / రెండుమాటలు
ఒకటి శుభ్రత / మరొకటి భద్రత"

అమెరికా స్వర్గంలా ఉందంటాడు చెన్నప్ప ఓచోట. నిజమే. అక్కడ పరిపాలన (Governance) కూడా అమోఘం. అట్లాంటి అమెరికా విదేశాంగ విధానం మాత్రం లోపభూయిష్టం. ఇతరులపైకి కాలుదువ్వే తత్వం దానిది. 'భద్రత' నిజమే కాని తన విధానాల వల్ల తనకే భద్రత కరవైంది. వరల్డ్ ట్రేడ్ సెంటర్ పైన విధ్వంసం జరిగినప్పుడు నేను ఆ పరిసరాల్లోనే (నువర్క్) వున్నాను.

ఈ గ్రంథం ఒకరకంగా 'అమెరికా దర్శనం' అని చెప్పొచ్చు. చెన్నప్ప అమాయకత్వం, బోళాతనం, పసితనంలోని నిర్మలత్వం, కొండొకచో గడుసుతనం అన్నీ కలబోసినట్టుగా ప్రతిఫలిస్తాయి.

ఆచార్య మసనచెన్నప్ప అమెరికా ఆకాశంలోంచి నానీల చుక్కల్ని రాలుస్తున్నాడు. రండి! తడుద్దాం.

# To know the noble ideals and ideas of Chennappa in US

*The name Chennappa denotes beauty. Professor Masana Chennappa is known for his beautiful Telugu. He expresses in sweet words, simple and powerful.*

*He is a poet because he thinks and reflects those thoughts immediately in a few lines. His quick thoughts on United States are presented in the form of "Naanees" which can straight go into hearts of readers without any effort. To understand some, you know, we need dictionaries.*

*Chennappa, like his Telugu, is simple and clear in his communication. We can understand him with ease.*

*I have no surprise that he ridiculed materialism in United States but appreciated their discipline, neatness and technological progress. He says that the India is a paradise of social relations, while one can enjoy the privacy in United States. The 'Privacy' is so private there that you need to wait for week end to fix an appointment with another on phone.*

*He draws a thoughtful comparison between living here and there (US). Right from airhostess to scantily dressed young girls in the streets of Los vegas did not escape is insightful looks, and thereafter his satiric remarks.*

*Roads are wide here but what about minds, he asked. Do you want to go to US, need to ride over clouds and cross over the oceans, that is how he puts the journey to America. America, for him is 'amarica' = which means arrangement in Telugu, phonetically sounds like America, and he puns on that word to develop some Naanies.*

*His another satire is, 'the Telugu Associations in US are also divided like estranged couples'. Chennappa proclaims that Telugu people get united because of 'English' in US. The*

*One fine point he made is: 'They look to our Himalayas and we stare towards Niayagara to mean east is after west while the west looks to east for many things'. The Telugu Professor defined US in two words, sanity and safety. 'To think of others, it is India, to bother only about ourselves, it is US' - this is another definition he gave to US, though it is doubted in the back drop of present selfish generation sweeping across India, forgetting values and going after dollars. He has a dig at non-resident Indians: 'People here love their motherland, do we?'*

*One fine point he made about US is that 'there they do not make women cry, a point to be noted by Indians'. At the same time he admonishes the way 'they neglect children'. He admires their observation of rule of law, adherence to systems, respect for courts, in spite of love for dollars and materialistic pleasures.*

*His love for values and concern for dharma is reflected in his two-word, four line stanzas of simple Telugu poetry called in Telugu as Naanee.*

*Chennappa is a man with love filled heart, so every where his eyes catch only love and peace, and in the process we forget that US is distributing terror and violence to the whole world and marketing weapons to shed the blood of humanity. Some where he agrees with it and says: 'apparently recites peace mantra but generates the fear of war everywhere'.*

*For a quick reading and fast understanding of what happens in US, we can scan through the "America O America", and we also know the mind of the writer, Masana Chennappa.*

*I greet him for his noble thoughts and appreciate his love for peace, freedom and values.*

**Madabhushi Sridhar**
**Professor, NALSAR**
**University of Law.**

Guru Poornima
Hyderabad.

# అమెరికా గురించి

**అ**మెరికాలో అడుగుపెడితే అదొక కొత్త ప్రపంచం అనిపిస్తుంది. ఏ మూలకు వెళ్ళినా ఏదో ఒక దృశ్యం మనల్ని ఆకట్టుకొంటుంది. సాధారణ యాత్రికులకే వింతలతో, విశేషాలతో ఆశ్చర్యాన్ని కల్గించే అమెరికా, కళాకారులను ఎక్కువగా ప్రభావితుల్ని చేస్తుందని నా అభిప్రాయం. అమెరికాలో తిరుగుతున్నప్పుడు గుట్టల ప్రాంతంలోను, సముద్రతీర ప్రాంతాల్లోను చిత్రకారులు స్వయంగా నిలబడి తమ కుంచెలకు పని చెప్పడం స్వయంగా చూశాను. నా దృష్టిలో అమెరికా ఒక ఆధునిక వస్తు ప్రదర్శనశాల, అద్భుతమైన పర్యటన కేంద్రం.

2009 జులైలో తానా సభలకు వెళ్లిన నేను నాల్గు నెలలపాటు లాసేంజెలిస్‌లో ఉన్నాను. అమ్మాయి శ్రావణి, అల్లుడు నాగరాజు నాకు ఆతిథ్యం ఇచ్చారు. అదే సమయంలో అక్కడే ఉన్న మా చిన్న కుమారుడు ప్రణవ్ సహాయంతో అమెరికాలోని వివిధ నగరాలను సందర్శించాను. వెళ్లిన ప్రతిచోటా నాకు కొత్త అనుభూతి లభించింది. హృదయం స్పందించినప్పుడల్లా ఒక నానీ ఉద్భవించింది. లెక్కబెడితే నాల్గువందల దాకా అయ్యాయి. వీటినన్నింటినీ పుస్తకరూపంలో తెస్తున్నందుకు నాకు తృప్తిగా ఉంది.

నేనింతకు పూర్వం 'చెన్నప్ప నానీలు' పేరుతో ఒక నానీల సంపుటిని ప్రచురించాను. దానిలో, అమెరికాను చూడకముందు "అమెరికా, అమెరికా అంటారేమిటి? నాకు కావలసింది అమరిక" అని చెప్పుకొన్నాను. కాని ఆ తర్వాత అమెరికాను చూసి ఆ అమరిక ఏమిటో స్వయంగా తెలుసుకొన్నాను. అమెరికాలో నాకే కాదు, నా కలానికి విశ్రాంతి లేదు. ఉన్నన్ని రోజులు ఊహల్లో ఊరేగడం మాని, అమెరికా సంస్కృతి-సంప్రదాయాలను అధ్యయనం చేయడానికి ప్రయత్నించాను. ఈనాటి ప్రపంచంలో ఒక మనిషి ఎలా జీవించాలో అమెరికా చెప్తుంది. ఇది ఒప్పా? తప్పా? అనే ఆలోచన కంటె, 'ఇది మనకు సరిపోతుంది, ఇది మా జీవనవిధానం' అని ఒక పద్ధతి ఏర్పరుచుకొని, ఒక చట్టాన్ని రూపొందించుకొని దాన్ని ఉల్లంఘించక కట్టుబడి ఉన్న తీరు నాకు ఆశ్చర్యాన్ని కల్గించింది.

అమెరికాలో ఏ రంగాన్ని పరిశీలించినా అంతర్గతంగా ఒక క్రమశిక్షణ ఉంది, అంతకంటె మించి దేశంపట్ల ప్రేమ ఉంది. ఆత్మగౌరవానికి అమెరికన్లు ఇచ్చే ప్రాధాన్యం ఇంతంత కాదు, ఆ కారణంగానే అది ప్రపంచంలో అగ్రస్థానంలో నిలబడ గలిగింది.

'సంస్కృతి' అంటే, [illegible] అమెరికాను

చూసిన తరువాత నాలో మరింత బలపడింది. ఐతే అమెరికా, భారతీయ సంస్కృతులలో ఎన్నో వైరుధ్యాలున్న మాట వాస్తవం. వీటిని నా నానీలు ప్రతిబింబించాయి.

నేను అమెరికాలో ఉండి నాల్గు మంచిపనులు చేశాను. వాటిలో ఒకటి ఛాందోగ్యోపనిషత్తును ముత్యాల సరాలలో తెనిగించడం; రెండవది నయాగరా మీద ఒక కావ్యాన్ని రాయడం; మూడవది అమెరికా పర్యటనకు సంబంధించిన వివరాలతో ఒక యాత్రా చరిత్రను రూపొందించడం; నాల్గవది 'అమెరికా నానీలు' రచించడం.

ఈ 'అమెరికా నానీలు' కవితా సంపుటికి కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత డా॥ ఎన్.గోపిగారు ముందు మాట రాసినందుకు నా కృతజ్ఞతలు. నల్సార్ యూనివర్సిటీ ఆఫ్ లా ప్రొఫెసర్ మాడభూషి శ్రీధర్‌గారు తమ అమూల్యమైన అభిప్రాయాన్ని తెలిపినందుకు బహుధా కృతజ్ఞతలు.

కృతి స్వీకర్త గురించి ఇక్కడ రెండు మాటలు చెప్పాలి. శ్రీ.జి.ఉపేందర్ రావుగారు నా చిరకాల మిత్రులు. సికింద్రాబాద్‌లో వారి యిల్లూ, మా యిల్లూ ఒక్క దగ్గరే ఉన్నాయి. వారు సి.టి.ఓ.గా పని చేస్తున్నారు. జీవితంలో అంచెలంచెలుగా ఎదిగిన వ్యక్తి. స్నేహం విలువతో పాటు, కష్టం విలువ తెలిసిన ఉపేందర్‌రావుగారు నా యీ 'అమెరికా! ఓ అమెరికా!' కవితా సంపుటికి స్వీకర్త కావడం నాకెంతో సంతోషంగా ఉంది.

ఈ సంపుటికి డి.టి.పి. సౌకర్యాన్ని కల్గించిన జాగృతి గ్రాఫిక్స్, కాచీగుడావారికి, ఈ సంపుటిని అందంగా అచ్చువేసిన 'మౌనికా గ్రాఫిక్స్' అధినేత ఆర్. సంతోష్‌కుమార్ గారికి నా కృతజ్ఞతలు.

చెన్నప్ప నానీలను ఆదరించినట్లే అమెరికా నానీలను కూడా ఆదరించాలని సహృదయ పాఠకులను కోరుతున్నాను.

02-08-2010 - మసన చెన్నప్ప

అమెరికా
అంటారేమిటి?
నాకు కావలసింది
భావాల అమరిక.

1

నల్గురితో సుఖమా
ఇండియాలో ఉండు
ఏకాంత వాసమా!
అమెరికాకు రా.

2

అమెరికా కావ్యంలో
శృంగారమే అంగిరసం
పాపం! శాంతానికి
శాంతిలేదు.

3

ఇక్కడివాళ్లు
సురకన్యలు!
భూమ్మీద కాళ్లుండవు
వొంటికి దుస్తులుండవు.

4

ఇక్కడివాళ్ళంతా
రైటిస్టులే
ఎడమ వైపు
నడవరు, చూడరు. 5

ఇక్కడి వైద్యులు
అపరధన్వంతరులు
నరకద్వారాలు
మూసేశారు. 6

అడుగడుగున
శుభ్రత
అదే కదండి
అమెరికా ఘనత! 7

ఇక్కడ
జీవితకాలమెక్కువ
ఔను! మరి
క్రిములు దప్ప క్రిములుండవు. 8



మైళ్లకొద్ది
ప్రయాణించాను
ప్రజలు కనిపించరు
పరిగెత్తే కార్లు తప్ప. 9

సముద్రాలుదాటి
మేఘాలమీద
కలలు కంటూ పోతే
అదే అమెరికా. 10

అమెరికాలో
రోడ్లు విశాలం
కాని,
మనుషుల అంతరంగాలు? 11

వివేకానందుడు
షికాగో వచ్చాడు
వివేకం పురివిప్పి
నాట్యమాడింది. 12

బాలాజీ,
స్వామినారాయణుల ఆలయాలు
షికాగోలో
భక్తిభావనిలయాలు. 13

తెలుగుసంఘాలు విడిపోయాయి
భార్యాభర్తల్లాగా,
అమెరికా
మజాకా! 14

ఇక్కడి
ఇంజినీర్లకెంత పవర్?
షికాగోలో మింటినంటే
సియర్స్‌టవర్! 15

ఇక్కడి బస్సులకు
మనుషులు కరవు
మనదేశంలో
బస్సులే కరవు! 16



అన్నింటిలో
వేగమే వేగం
ఆత్మీయుడు కనిపించినా
ఆగం ఆగం. 17

మనదగ్గర లేనిదీ
అమెరికాలో ఉన్నదీ
అదొక్కటే
అమరిక! 18

పైపై మెరుగులే
అమెరికన్లవి
ఆత్మలోకి చూసే
కన్నులు మనవి! 19

అమెరికా
అంటే మాటలా?
రోడ్లు పరిగెత్తుతాయి
ఇండ్లు నడుస్తాయి. 20

అమెరికాను
చూడాలని వచ్చావా?
ఐతే
వారానికైదు రోజులు ఖైదీవే. 21

నూటయాభైకి
ఆక్సిజన్ ఛాంబర్ కొన్నావు
అయ్యో జాక్సన్!
బ్రతికింది యాభయ్యేళ్లా? 22

చట్టమంటే
ఇక్కడి వాళ్ల కెంత గౌరవం!
ఈ అలవాటు
మనకెట్లొస్తుందో! 23

క్యారే
ఎంత మంచివారే!
ఇక్కడ ఎవరికి వారే
నయాగరా తీరే. 24



ఓ అమెరికా!
నీకానందమేనా?
మా వాళ్లు
నీభాషలో అదరగొడుతారు. 25

గోమాతా!
ఇక్కడ నీ పాలే త్రాగాలి
నిన్నంతర్జాతీయ మాతను
చేయాలి. 26

అమెరికా దృష్టి
హిమాలయాల వైపు
మనదృష్టి
నయాగరా వైపు 27

ఇక్కడ
ప్రసూతిఖర్చు పదిలక్షలు
జననం!
ఇంత ఖరీదా! 28

ఇక్కడి రోడ్లు
అద్దాల్లా మెరుస్తాయి
మనం బొట్టు కూడా
పెట్టుకోవచ్చు. 29

మన దగ్గర పిల్లలేడిస్తే
చాక్లెట్లొస్తాయి.
కాని ఇక్కడ
*కాప్‌లొస్తారు. 30

సూరీడు
భారతమాత నుదుటి బొట్టు
అతడిక్కడ
కనిపిస్తే ఒట్టు! 31

ఇక్కడ
బ్రతకటానికి అందరొస్తారు
కాని జీవించేవాళ్లు
కొందరే. 32

* కాప్‌లు = పోలీసులు



అమెరికాను గూర్చి
రెండుమాటలు చెప్పాలి
ఒకటి శుభ్రత
మరొకటి భద్రత. 33

ఇక్కడి
న్యాయస్థానాలకు
ఒక్క చెవులే కాదు
కళ్లూ వుంటాయి. 34

అమెరికాలో
చట్టం చేతిలో జనం
ఇండియాలో
జనం చేతిలో చట్టం 35

సూర్యుని చుట్టు
భూమి తిరుగుతుంది
డాలర్ చుట్టు
మనిషి తిరుగుతున్నాడు. 36

ఇది నిజంగా
స్వర్గమే
ఇక్కడికి రావాలంటే
నరకం చూడాలి మరి! 37

ఓ ప్రియమైన
చీపురు కట్టా!
అమెరికన్లు
నీకడ్డుకట్ట వేశారు! 38

అమెరికాలో
తాడిచెట్లు!
మన కలాలీలకు
వీసాలు దొరికితే బాగుండు. 39

స్వర్ణ కాంతులు వెదజల్లే
కొండలు!
వాటి అడుగున
ఎన్ని నిధులున్నాయో! 40



రోడ్డుకటీటు
బంగారు గుట్టలు
పసుపు నీట్లో
తడిపారేసిన బట్టలు! 41

మనం కొబ్బరికాయలు
కార్లకు కొడుతాం
కాని ఇక్కడ
రోడ్లకు కొట్టాలి. 42

ఎదుటివాణ్ణి గూర్చి ఆలోచిస్తే
ఇండియా,
తనగురించైతే
అమెరికా. 43

కూడూ, గూడూ, గుడ్డా
నా దేశంలోనే చింత
ఇక్కడైతే
ఒక వింత! 44

మీకు నిజంగా
మారాలని వుందా?
అయితే
అమెరికాను చూడండి! 45

వీసాల కోసం
మోసాలా?
నాకిప్పుడే తెలిసింది
ఇక్కడేదో రుచి ఉందని. 46

భారత భూమిని
తక్కువగా చూడకు
అది
ఋషుల భూమి అని మరవకు. 47

మనోళ్లు
స్వర్గాన్ని చూపిస్తారు
అది ఆకాశంలో లేదు
అమెరికాలో ఉంది. 48



పైకి రావాలని
అమెరికన్ల విశ్వ ప్రయత్నం
పాతాళంలో
ఉన్నోళ్లు కదా! 49

ఇక్కడ
ఆకాశంలో సూర్యుడు
భూమ్మీద
తామరసనేత్రలు. 50

ఇక్కడ సుఖం
కష్టంతో కూడుకొన్నది
ఉద్యోగం వినా
ఒక్కక్షణం వుండలేం. 51

ఇక్కడెక్కడా
నీరు పడనీయరు
స్త్రీలను
కన్నీరు పెట్టనీయరు. 52

అమెరికా అంటే
ఏమనుకున్నారు?
పైసలు తప్ప
పరమాత్మ గుర్తుకు రాదు. 53

ఇక్కడ తప్పుచేస్తే
శిక్ష తప్పదు
అమెరికన్లు
లక్ష్మణరేఖ దాటరు. 54

ఎక్కడ చూసినా
అందమైన కార్లు!
ఎడతెగని
చీమల బార్లు! 55

లాసేంజెలిస్
అందమైన సిటీ
సంపాదనపరులకే
ఉండే కెపాసిటీ. 56



అమెరికాకు
వచ్చారా?
కమ్మని కలలు
ఎన్నైనా కనవచ్చు. 57

ఒబామా
అదృష్టవంతుడు
పిల్లల హృదయాల్లో కూడా
భాస్వంతుడు. 58

ఎక్కడివో
ఈ నవ్వులు
అమెరికన్ల ముఖాల్లోనే
కనిపిస్తాయి. 59

విమానం దిగాను
ఇంకా
ఎయిర్ హెూస్టెస్ చూపులు
నన్ను వెంటాడుతూనే వున్నాయి. 60

నాభాషలో
కష్టమ్స్‌వారు ప్రశ్నిస్తే
నాకు
కష్టమే ఉండేది కాదు. 61

ఇక్కడ
పిల్లల్ని బాగా చూస్తారు
మొదట శ్రద్ధతో
తర్వాత అశ్రద్ధతో. 62

సూపర్ బజార్లు
సూపర్!
కాని, మద్యం సీసాలూ
మాంసం ప్యాకెట్లే వెగటు. 63

సిటీ సిటీకి
సమయంలో తేడా
మనిషి మనిషికీ
ఆలోచనలో కూడా. 64



'తానా'కు వెళ్తే
కడుపు నిండింది
ఇక 'ఆటా'కు
వెళ్లి రావాలా? 65

ప్రపంచమా!
నువ్వెంతో మారావు
నటవిటగాయకులకే
సత్కారాలు! 66

షికాగో సెంటర్లోనేకాదు
మా చిక్కడ పల్లిలోను
సైన్‌బోర్డులు
ఆంగ్లంలోనే. 67

మూన్నాళ్ళ ముచ్చట
కానేకాదు,
తానా సభలు
రెండేళ్ల తెలుగు పండుగ. 68

తానాలో
ఇసుకేస్తే రాలని జనం
నిర్వాహకుల
నైపుణ్యానికి నిదర్శనం! 69

తానాలో
భోజన వ్యవస్థ పటిష్టం
కాని
సమావేశాలే అందరికిష్టం. 70

అమ్మో
తెలుగువాళ్లు!
తెనుగుదనానికి
తానాసభలు చలువపందిళ్లు! 71

గొల్లపూడీ! నువ్వు
నాటికా రచనాచణుడవు
నటనలోనూ
ఘనుడవు. 72



తానాసభలో
దాశరథిపై నీ ప్రసంగం
మైత్రీసౌరభ
తరంగం. 73

తానాలో అతని
తొలి పలకరింపు
వంశీ రామరాజా!
సాంస్కృతిక రోజా!! 74

ఇక్కడ
సంధ్యాకాలంలో భోజనాలు
హెూటళ్ల నిండా
ప్రభంజనాలు! 75

ఇక్కడా
అవధానాలు రక్తి కడుతాయి
ఆదరించే వాళ్లే
వాటికి కళ్లు.
నేను 76

"సియర్స్ టవ"రెక్కానో లేదో!
పదిహేను రోజులకే
"విల్లిస్ టవ"రైంది 77

అమెరికాలో
యంత్రాలదే పైచేయ్
అందుకే గదా
హాయంటే హాయ్! 78

ఒక్కసారి
అమెరికాకు వచ్చిపో!
నువ్వు మారకపోతే
నన్నడుగు. 79

లాసేంజెలిస్‌లో
*టాస్క్ సంబరాలు!
ఎక్ట్రాలకే
ఘన సన్మానాలు! 80

* తెలుగు అసోసియేషన్ ఆఫ్ సదరన్ కాలిఫోర్నియా.



ఆచార్యుడంటే
అంత అలుసా?
వేదికలెక్కాలంటే
ఎన్ని కష్టాలో తెలుసా? 81

తెలుగు మాట్లాడితే
సరిపోతుందా?
సంస్కృతి లేని
సంగతు లెందుకండి? 82

అదొక
సాంస్కృతిక బృందమా?
అపార్థాల
అశ్లీలాల దుర్గంధమా? 83

విరగబడి
నవ్వాలని వుందా?
ఐతే ఒకసారి
'టాస్క్'ను చూసిపోండి. 84

వేదికమీదనే
గౌరవసభ్యుల తగవులాట!
'టాస్క్' అంటే
మాటలా? 85

అబ్బో
మిమిక్రీ శ్రీనివాస్
అతడు బొమ్మలతో
హాయిగా మాట్లాడుతాడు. 86

యువత
ఎక్కడికి పోతుందో తెలువదు
గాలి పటాలకు
గమ్యముంటుందా? 87

మన రూపాయి
ఎంతో అందమైంది
ఐనా
డాలర్‌దే బడాయి! 88



తెల్లవాడు
తెలివికల్లవాడు!
కులాలను
అమెరికాకూ మోసుకొచ్చాడు. 89

ఆంగ్లమా!
నీకో నమస్కారం.
తెలుగు వారికి
అమెరికాలో స్థానమిచ్చావు. 90

ఆశ్రమాలంటే
ఇష్టపడేవాణ్ణి
బీచీలలో
తిరగాల్సి వచ్చింది. 91

ఇక్కడివారిలో
పగా, ద్వేషం కనిపించవు
సొంతలాభాన్ని
అవి మించవు. 92

ఇక్కడెక్కడ చూసినా
ప్రవరులు కనిపించరు
అంతటా
వరూధినులే. 93

అమెరికాను
చూడగానే తెలిసింది
సైకిలు
ప్రపంచ వాహనమని. 94

ఇక్కడ పున్నమ నాడూ
నెలవంక కనిపించదు
సూరీడే
మొనగాడు. 95

పలకరిస్తే
పులకరించకు
డాలర్ మాత్రం
రాలి పడదు సుమా! 96



భార్యతో
అమెరికాకు రండి.
ఉప్పుకారాలకు
గౌరవమైనా దక్కుతుంది. 97

అమెరికా
ఎంతగొప్పది!
ఎవరి జోలి వాళ్లది
ఎవరి జోలె వాళ్లది. 98

ఇక్కడ కాళ్లు
కార్లల్లో వుంటాయి
కళ్లు
నెత్తి మీదుంటాయి. 99

కప్పులైనా
కడుగుతారిక్కడ
డాలరంటే
మనుషులకెంత ప్రేమ! 100

తల్లి లేదు
పెళ్లాం లేదు
అమెరికా సుందరి ముందు
ఏదీ నిలవదు. 101

స్వార్థమా!
నువ్వెంత గొప్పదానివి
నీ మూలాలు
అమెరికాలో కనిపించాయి. 102

ఇక్కడ
వంతెనలపై వంతెనలు
మనదేశంలో
వంచనలే వంచనలు! 103

నాదేశంలో
నియమబద్ధుణ్ణి
ఇక్కడ
కాలకృత్యాలు మారిపోయాయి! 104



ఫోన్లో
పలకరించాలని వుందా?
వీకెండ్లకై
ఎదురుచూడాలి మరి! 105

ఇక్కడ నిన్నటిది
ఈరోజు తింటారు
రేపటిది
ఇవ్వాళే చేస్తారు. 106

భారతీయుల్లారా
మీకో దండం!
ఇక్కడ
మరిచిపోనివి మన సేవలే. 107

హనుమంతుని గొప్పతనం
రామునికే కాదు
ఒబామాకు
తెలిసి పోయింది. 108

అవ్వలకు వీసాలు
గొప్పేమరి!
మనుమ(రా)ళ్ల డైపర్లు
మార్చాలి కదా! 109

ఇక్కడెవడూ
దేవుణ్ణి పట్టించుకోడు
అంత సమయం
దొరికితే కదా! 110

జ్ఞానంతో
మన తలలు బరువెక్కాయి
మోయలేక
భుజాలు డీలా పడ్డాయి. 111

ఇక్కడి సుఖమే
సుఖమా!
ఐదు రోజుల నరకం
రెండ్రోజుల స్వర్గం! 112



ఓ
నా భారతమా!
ఏమిటి నీ చింత?
భక్తి, భుక్తి, ముక్తే కదా! 113

ఇక్కడేది మాట్లాడినా
తప్పు
అసలమెరికాకు
రావడమే పెద్దతప్పు! 114

సెల్లూ, క్రెడిట్ కార్డ్
కారూ, ల్యాప్టాపుంటే చాలు
ఉద్యోగం
అదే వస్తుంది. 115

హరే క్రిష్ణ
మందిరానికి వెళ్లాను
ఎందరు
చిన్నికృష్ణులు కనిపించారో! 116

అదిగో
సియర్స్‌టవర్
అంతరిక్షానికే?
షవర్! 117

స్కైడెక్
అధిరోహించాను
నాల్గు రాష్ట్రాలు
నా ముందు నిలిచాయి. 118

షికాగో
అందమైన నగరం
చూసేదాకా
మావాడు గరం గరం! 119

అమెరికాలో
అమ్మపాలకంటె
ఆవు పాలకే
ఎక్కువ డిమాండు. 120



*'వెనిస్'లో
సముద్రంమీద నడిచాను
బ్రిడ్జి పొడవు
అంతే మరి! 121

ఇక్కడ
మందు వాడకం ఎక్కువ
మందుల వాడకం
తక్కువ. 122

అమెరికా
అంటే ఏమనుకొన్నారు?
వెలగల్గిన వస్తువులకి
అంగడి. 123

'మ'కారాన్ని
నిషేధించేవాళ్లు
మన దేశాన్ని
విడువకుంటే మంచిది. 124

* లాస్ ఏంజెలిస్‌లో ఒక బీచ్ పేరు

ఇక్కడ
లక్షలిచ్చి అద్దెకుండాలి.
కోట్లిచ్చి
ఇండ్లు కొనాలి. 125

అమెరికాలో
జనం తక్కువ
నా దేశంలో దానికి
నాల్గింతలెక్కువ! 126

అమెరికాలో
యాభై రాష్ట్రాలు
నాదేశంలో
ఎందుకింత పక్షపాతం? 127

అమెరికన్లు
ఆట వస్తువులతోనే కాదు,
అన్ని దేశాలతోనూ
ఆడుతారు. 128



పిల్లలకింకా
మాటలే రావు
ఆట వస్తువులు మాత్రం
బండెడు. 129

ఓ
వేదాంతమా!
నీవానందంగా ఉండే చోటు
అమెరికా మాత్రం కాదు. 130

ఏమిటో
ఈ డాలరు?
మనల్ని ఏదీ
కొననివ్వదు, తిననివ్వదు! 131

ఇక్కడి రహదారులూ
మనుషులూ ఒక్కటే
ఎవరికీ
నిద్ర వుండదు. 132

అమ్మయ్య!
ఇక్కడ హాయిగా వుంది!
రోడ్ల మీద
ప్రార్థనా మందిరాల్లేవు. 133

మైకేల్ జాక్సన్!
నీ పిల్లలు సొంతం కారా?
ఐనా నీకు
కోట్లమంది అభిమానులు! 134

మైకేల్ జాక్సన్
మరణించ లేదు
ప్రేమికుల గుండెల్లో ఇంకా
బ్రతికే ఉన్నాడు. 135

నువ్వు సినిమా అత్తరు
పూసుకున్నావా?
ఐతే అమెరికా
నిన్ను పిలుస్తుంది. 136



గంతులేయడం
గొంతు చించుకోవడం నేర్చావా?
ఇంకేం
అమెరికాకు వచ్చెయ్. 137

అబ్బో
రెస్ట్ రూములు!
మన దేశంలో పడకటిళ్లూ
అంత శుభ్రంగా ఉండవు. 138

ఇక్కడ
జీవితాలకంటె
జీవితసాఫల్య పురస్కారాలే
గొప్పవి. 139

ఇక్కడ తిన్నది
క్యాలరీల్లో చూస్తారు
శరీరాన్ని
వెయింగ్‌స్కేల్ మీద తూస్తారు. 140

అందమైంది
శాంటాబార్బరా!
అమ్మాయిలను చూస్తూ
నడవలేం బిరబిరా! 141

అమెరికా
స్వాతంత్ర్య దినోత్సవం!
ఆకాశం అంతా
పూలజల్లులమయం. 142

శిల్పాలూ
తైలవర్ణ చిత్రాలూ
కొలువుదీరిన చోటే
"గెట్టీ" సెంటర్ 143

గుట్టమీద
"గెట్టీ" సెంటర్
పుడమిలో ఎక్కడా కనిపించని
పూలజాతులు! 144



ఇక్కడి పిల్లలు
వస పిట్టలు
ఆంగ్ల భాషలో
మంచి దిట్టలు! 145

సౌకర్యాలకు
అమెరికా కల్పతరువు
నిద్ర మాత్రం
కరవు. 146

ఇక్కడి వాళ్లల్లో
కనిపించనిది తడబాటు
కనిపించేది
ఎడబాటు! 147

ఇక్కడ
మనవాళ్లు చేస్తున్నదేంటి?
కష్టపడి
సుఖాన్ని అనుభవించడం! 148

ఇక్కడ
ఇంగ్లీషే రాజభాష
తెలుగు కా అదృష్టం
ఎన్నడు కలుగుతుందో! 149

తెలివైన ఇంజినీర్లకు
అమెరికా గాలం
కన్నోళ్లకిక
ఎడబాటు కాలం! 150

అమెరికన్లు
ఎంత గొప్పోళ్లు!
విలువలే కాదు
వలువలూ పట్టించుకోరు. 151

అగ్రదేశాల్లో
ఆర్థిక మాంద్యమా?
ప్రపంచ బ్యాంకు
ఋణాలివ్వడం మానలేదే? 152



సుఖం కావాలా
అమెరికా విచ్చేయండి
'జననీ జన్మభూమిశ్చ'
మరచిపోండి. 153

పిల్లలకు
ఇంగ్లీషు రావాలా?
తల్లులు పిల్లల్ని
ఇక్కడే కంటే సరిపోదూ! 154

ఒక్కనిమిషం
రమ్మంటే రారు
కాని ఒక రోజైనా
ఫోన్లో మాట్లాడుతారు. 155

ఇక్కడి వారు
సంస్కారాలకు దూరం
పట్టుకున్నారు
కొత్త విలువల దారం 156

ఒక్క
కంప్యూటర్లకే కాదు
ఎక్కడ లేని జల్సాటూర్లకు
అమెరికా పాదు. 157

ఇక్కడ
భూకంపాలు జాస్తి
ఐనా ఆకాశంలో
డొన్‌టౌన్ల కుస్తీ! 158

ఇక్కడా
ఘోరాలు తప్పవు
కాని ప్రసారమాధ్యమాలు
భయపడేలా చెప్పవు 159

వైరం
లేనిదెక్కడ?
భారత్‌లో కులాలమధ్య
అమెరికాలో జాతులమధ్య 160



అమెరికాలో ఉన్నా
అంతరిక్షంలో ఉన్నా
వేదమే
అందరికీ శరణ్యమన్నా! 161

మనకు
పురుషార్థాలు నాలుగు
అమెరికన్లకి
అర్థకామాలు రెండే. 162

ఇక్కడికి
రాగానే తెలిసింది
లక్ష్యం కంటె
లక్షలు గొప్పవని! 163

ఇక్కడ
ఏం చేసినా అలసిపోరు
మన దేశంలో
ప్రతిదానికీ పోరు. 164

అదేమి
చిత్రమో!
ఇక్కడ ప్రతి నిమిషం
నా దేశమే గుర్తుకొస్తుంది. 165

అమెరికా
భూతల స్వర్గం
ఆలోచిస్తే
ఇక్కడ పుట్టిన వాళ్లకే. 166

అమెరికన్లది
వర్తమానమే
భారతీయులవి
భూత భవిష్యత్తులు. 167

అమెరికాలో
ఆంగ్లభాషకు లేదు పోటీ
ఆంధ్రప్రదేశ్‌లో
తెలుగు లూటీ 168



ఇక్కడివారు
ఏదీ దాచుకోరు
స్నేహితులను
అంతకంటే దోచుకోరు. 169

ఇక్కడా
అదే జరుగుతుంది.
ఇన్స్యూరెన్స్ చేసి
ఏదైనా తగలబెడతారు. 170

భారతం
ఆధ్యాత్మిక దేశం
మలిగిపోని
జ్ఞానప్రకాశం 171

ఇక్కడ
మనుషులే తప్ప
మతం
రోడ్డు మీదికి రానే రాదు. 172

ఒబామా
అమెరికా అధ్యక్షుడు
గౌరవం
ఇచ్చి పుచ్చుకునే దక్షుడు. 173

ఒబామా
అధ్యక్షుడయ్యాడు
అమెరికాలో
నల్లవాళ్లకు పండుగ. 174

ఓ అమెరికా!
ఇదేం బాగు?
ఇక్కడ మనుషుల్ని
మందలించే వాడే లేడు. 175

ఆర్థిక మాంద్యం
అమెరికాకిబ్బంది
అందుకే తగ్గింది
సాంకేతిక సిబ్బంది. 176



అమెరికా గుప్పిట్లో
భూగోళం!
కాదు, కాదు
అణుబాంబుల కౌగిట్లో. 177

ఇక్కడ
కాలర్ సరిచేయడమే కాదు
గడియారాలనూ
సరిచేయాలి. 178

మనవాళ్ల రాగద్వేషాలు
మాటల్లో,
ఇక్కడ మాత్రం
చేతల్లో. 179

పెత్తనానికి
అమెరికా పెద్దన్న
వందేళ్లైనా
మనకది రాదన్నా! 180

డాలర్‌కూ
రూపాయకూ పోలికే లేదు
రెండింటిని సమంచేసే
కోరికే లేదు. 181

శారదాపూర్ణ
నిజంగా శారద
సంగీత సాహిత్యాల్లో
విశారద! 182

ఇక్కడెన్నో
తెలుగు సంఘాలున్నాయి
కాని,
కవులనాదరించేవి ఏవి? 183

ఇక్కడివారికి
మాతృదేశమంటే ఎంతప్రేమ!
మరి
భారతీయులకు? 184



ఎన్ని
సంవత్సరాలైనా
అమెరికా ఎక్కలేనిది
ఆధ్యాత్మిక శిఖరమే. 185

అలవాట్లు లేకుంటే
మనిషే కాడు
మానవతను మించిన
అలవాటు లేదు! 186

ఇక్కడికి కుక్కపిల్లల్ని
ఎగుమతి చేయండి
కన్నబిడ్డల్లా
చూస్తారు. 187

అమెరికాలో
తెలిసిన వాళ్లున్నారు.
ఎవరు కలిశారని
అడక్కండి! 188

హైద్రాబాద్‌లో
నా దేశాన్ని చూశాను
అమెరికాలో
ప్రపంచాన్నే చూశాను. 189

సభలకోసం
కోట్లు ఖర్చు చేస్తారు
సంస్కృతి అంటే
వీళ్లకెంత ఇష్టం! 190

అమెరికా అంటే
ఆధునికత.
అంతకంటె మించింది
నాగరికత. 191

ఇక్కడ తెలుగువాళ్లు
తెలుగులోనే మాట్లాడుతారు
మరి
నా దేశంలో? 192



ఇక్కడ పగటికీ
రాత్రికీ తేడాలేదు
కరెంటుకు
లోటుంటే కదా? 193

ఇక్కడ హొటళ్లు
దండిగా ఉంటాయి
బీచీలు
నిండుగా ఉంటాయి. 194

హాలీవుడ్డులో
అందాల తారలు
అప్సరసల్ని
తలదన్నే భామలు. 195

ఇండియాలోనే
అనుకున్నాను
అమెరికాలోను
అవార్డుల పిచ్చి! 196

ఇక్కడ హైస్కూల్ దాకా
ఉచిత విద్య
ఇండియాలో
లక్షలు ధారవోయాలి. 197

ఇక్కడి వాళ్లు
చట్టానికి భయపడతారు
శిక్షలు
శిరసావహిస్తారు. 198

కాలుష్యమా
నీకెంత పక్షపాతం?
అక్కడ కనిపించి
ఇక్కడ మాయమయ్యావు. 199

హైద్రాబాద్‌లో ప్రయాణం
భయం భయం
అమెరికాలో ట్రాఫిక్
నయం నయం! 200



'లాస్‌వేగాస్'
మయసభ లాంటిది
దుర్యోధనుడు
మళ్లీ వస్తేనో! 201

దాస్యం, తిరునగరి
కన్నీజులకాహ్వానం!
చూడాలి కదా
ఇక్కడి చోద్యం! 202

మనవాళ్లిక్కడికి
లక్ష్మి కోసమే వస్తారు
అందుకే
ఆడపిల్లలెక్కువ! 203

తల్లులారా!
మీ జన్మ తరించాలా?
ఆర్నెల్లకోసారి
అమెరికా రావల్సిందే 204

ఇక్కడెక్కడా
దుమ్ము కనిపించదు
అంగళ్లు
అద్దాలకు ముద్దుబిడ్డలు! 205

ఇక్కడ ఏ అడ్రస్సైనా
తెలుసుకోవచ్చు
*జి.పి.ఎస్.
దారిచూపే స్నేహితురాలు 206

తెలుగు సంఘాలకు
నా గమనిక
వేదికలపై
ఒక్క హాస్యమేనా? చాలిక. 207

అమెరికా నా దృష్టిలో
ఒక మంచి విద్యార్థి
గీత దాటని
అభ్యర్థి. 208

* గ్లోబల్ పొజిషన్ సిస్టమ్



'హాలోవిన్'
చిత్రమైన పండుగ
దయ్యం భయం పోవటానికి
దయ్యం వేషాలు! 209

'మెల్లోస్టోన్'
ఉంగరంలోని రాయికాదు
ప్రళయాన్ని తెచ్చే
అగ్ని పర్వతం! 210

మనకిక్కడ
సెలవులు మితం
హిందువుల పండుగలు
ఇళ్లకే పరిమితం! 211

విలువైన దాన్ని
వెలగట్టి
తెచ్చుకునే తెలివితేటలు
అమెరికావే. 212

అమెరికా
అందమైన విపణి
విదేశీ వస్తువులు
యథేచ్ఛగా చలామణి! 213

అమెరికన్లదంతా
విడ్డూరం!
అన్ని లావాదేవీలు
ఆన్‌లైన్ వ్యవహారం. 214

*కల్వర్ సిటీలో
చంద్రోదయం
నగరి కొలనులో
ఎరుపు తెలుపు కల్వలు. 215

పాత్రికేయురాలిపై
ఒబామా పాట
అమెరికా అధ్యక్షుని
కొత్త బాట! 216

* లాస్ ఏంజెలిస్‌లో ఒక ప్రాంతం.



శాన్‌ఫ్రాన్సిస్కో!
జాణవే నువ్వు
గోల్డెన్ గేట్ బ్రిడ్జి
నీ తలమీద కిరీటం! 217

ముసుగేసుకున్న
బంగారు గేటు
నవవధువంటే
ఇలాగే ఉంటుంది మరి! 218

నిన్ను చూడటానికి
వంతెనెక్కి రావాలి
సాగర తీరంలో
పులకించిపోవాలి. 219

హైద్రాబాద్ నుంచి
నిన్ను చూడాలని వచ్చాను
నువ్వేమో
మబ్బుల్లో దాగున్నావ్. 220

మెరిసే నిన్ను
గమనించాను
నింగికీ, నేలకూ
నిచ్చెనగా నిలిచావు. 221

ఓ గోల్డెన్ గేట్!
నువ్వెత్తైన దానివే
మంచులో
నీ నడుము కనిపిస్తేనా? 222

ఎవడో
నేతగాడు!
మంచుదారాలతో చీర నేసి
నీ నడుముకు చుట్టాడు. 223

ఓ వంతెనా!
నువ్వు అందమైన దానివి
వనధి నడుముకి
వడ్డాణానివి! 224



బంగారు గేటు
నడుమే బంగారం
ఎంతసేపున్నా
ఫోటో తీయనీయ లేదు. 225

నిన్ను చూడాలని
గుట్టమీదికెక్కాను
హార్బర్‌లో జనం
చీమల్లా కన్పించారు. 226

నీవున్న చోట
నిజమైన జాతర
సంధ్యాసూర్యుని
స్వర్ణకాంతుల పాతర! 227

'క్రుక్కెడ్ స్ట్రీట్'లో
మా కారు కదిలింది
చంటిది చంకనుంచి
చంకకు జారినట్లు. 228

"హాఫ్‌మూన్ బీచ్" లో
అందాల భామలు
ఆకాశం నుంచి దిగొచ్చిన
చందమామలు! 229

శ్వేతకన్యలు
మన్మథ బాణాలు!
సూర్యకిరణాలు
వారినేం చేస్తాయి? 230

"హాఫ్‌మూన్ బీచ్"లో
ఆగాలి కాసేపు
అలలతో పిల్లలమై
ఆడుకోవాలి. 231

అమెరికాలో
డౌన్‌టౌన్లు
తారల్ని సిగపూలుగా ధరించే
గౌన్లు. 232



ఇక్కడి మేడల
పునాదులు గట్టివి
జీవితసౌధాల
కుదుళ్లు ఒట్టివి. 233

మీ ఊహలన్నీ
నిజాలు కావాలా?
ఐతే అమెరికాకు
వచ్చి వెళ్లండి. 234

అమెరికాలో
సత్యనారాయణ వ్రతం
బ్రాహ్మణుడే దొరక్క
సతమతం. 235

అమెరికాలో
టీవీ ఛానళ్లు
పిల్లల కార్యక్రమాలకు
వెన్నెల దోనెల్లు! 236

నా దేశంలోనూ
నీటి పొట్లాలకు భలే గిరాకి
ఇది
అమెరికా మహిమే. 237

ఇక్కడ
స్మశానాల్లోనూ పతాకలు
మృత్యువులోనూ
దేశభక్తి! 238

ప్రపంచంలో
ఏదైనా కొనగలం
కాని అమెరికాను
మాత్రం కాదు. 239

ఇక్కడ
కొండలెక్కి దిగండి
ఏడు కొండలే
మనకళ్ల ముందు నిలుస్తాయి. 240



అమెరికన్లు
దేనికీ దమ్ము తీయరు
దేని మీదా
దుమ్ము పడనీయరు. 241

మన పాత నగరంలో
కారు నడిపారా?
అమెరికాలో
హాయిగా తిర్గొచ్చు 242

హైద్రాబాదులో
కారు నడిపారా?
ఇక ప్రపంచంలో
ఎక్కడైనా సాధ్యమే. 243

కార్లను
మోసుకెళ్లే ట్రక్కులు
పిల్లల్ని చంకన వేసుకునే
తల్లులు! 244

జయహో జయహో
రహమాన్!
సంగీత జగత్తులో
నువ్వే మహిమాన్! 245

ఇక్కడ చెత్తకైతే
బుట్టలుంటాయి
మరి
చెత్త కబుర్లకు? 246

*'ఎస్సెఫ్'కు కార్లో
నాల్గొందల మెళ్ల ప్రయాణం
దార్లో ఒక్కడైనా
అడ్డమొస్తేనా? 247

గడ్డి కూడా కనిపించని
కొండలు!
గుండు
కొట్టించుకున్నవేమో! 248

* శాన్ ఫ్రాన్సిస్కో



ఇక్కడి కొండలపై
మెత్తటి తివాచీలు
కారు విడిచి
షికారు చేస్తే బాగుండు. 249

కొలువు దీరిన
కొండలు!
రాతి దుప్పట్లు
ముడుతలు పడ్డట్లుంది! 250

ఇక్కడి ప్రకృతిలో
రంగుల క్రతువులు
ఏకకాలంలో
ఆరు ఋతువులు! 251

ఇక్కడి ఛానళ్లలో
యానిమేషన్ బొమ్మలు
అతుక్కు పోయే
పిల్లలూ బొమ్మలే. 252

అమెరికాలో
అన్నిటికీ మనదే భారం
ఇండియాలో
దేవుడే ఆధారం. 253

అద్భుతాలకు
పుట్టినిల్లు హాలీవుడ్
చూస్తుంటే
మరిచిపోతాం ఫుడ్. 254

హాలీవుడ్‌లో మబ్బులుండవు
వాన కురుస్తుంది
నిప్పుండదు
మంటలొస్తవి. 255

మాస్కులు ధరించిన
మనుషులు
మహానగరంలో
మాయగాళ్లు. 256



మత్తెక్కించే
మద్యమిక్కడ చౌక
ప్రాణాధారమైన
నీటికే ధరెక్కువ. 257

ఇక్కడివి
పెద్ద జీతాలు
ఉద్యోగాలు పోయాయా?
తెలియని శోక గీతాలు. 258

ఎండలొస్తే
కొండలు మండుతాయి
కాలిఫోర్నియా కాదిది
కాలే ఫోర్నియా. 259

అమెరికాలో
హిందూ దేవాలయాలు
భక్తిప్రపత్తులకు
నిలయాలు! 260

అమెరికాలో
కవిత్వ ముండదు
తిక్కపూవుకి
తిక్కన పరిమళించదు. 261

అన్ని పనులూ
ఆన్‌లైన్ మీదనే
ముందుముందు
కనటం కూడా ఆన్‌లైన్ లోనే. 262

నా దేశంలో
అన్నీ వున్నాయి
కాని క్రమశిక్షణే
అడక్కండి. 263

ఇక్కడ
ఉద్యోగముంటేనే సుఖం
లేకపోతే
పునర్విమాన దుఃఖం. 264



ఇక్కడెక్కడ చూసినా
పామ్ ట్రీలే.
అన్నింటికీ
వాటిపేర్లేమరి! 265

అమెరికాకు
అన్నీ దిగుమతులే
ఆయుధాలు మాత్రమే
ఎగుమతులు. 266

ఇంగ్లాండుకంటె
అమెరికా నయం
ఇది అందరికీ
సుఖమయం. 267

ఇక్కడెవరూ
ఎవర్నీ పట్టించుకోరు
డాలర్, సమయం
హడావిడుల జోరు. 268

ఇక్కడెవరికీ
తీరిక ఉండదు
పక్కవాణ్ణి చూసే
కోరికా అంతే! 269

మనవాళ్లు
స్వదేశంలో గంగిగోవులు
అమెరికాలో మాత్రం
గంగిరెద్దులు! 270

ఎడారి ప్రాంతంలో
లాస్ వేగాస్
భోగజీవులకు
ఒయాసిస్! 271

"లాస్ వేగాస్
ఒక నమూనా జగతి
అమెరికన్ల
తలదిరుగుడు ప్రగతి. 272



వేగాస్‌లో
అద్భుత నిర్మాణాలు
వెయ్యేళ్లకైనా అందని
కొలమానాలు. 273

వేగాస్
అందమైన భూభాగం
అందిస్తుంది
అందుకున్నంత భోగం! 274

వేగాస్‌లో ఇరవైనాల్గు గంటలు
విహరించవచ్చు
పగలే
పండు వెన్నెల! 275

లాస్ వేగాస్‌కు
వస్తే రా!
ఇక్కడ మాత్రం
పచ్చిపులుసు కావాలని అడగకు. 276

డాలర్లు నీకు
ఎక్కువయ్యాయా?
ఐతే,
లాస్‌వేగాస్ విమానమెక్కు! 277

అమెరికావాడు
స్వర్గం నిర్మించాడు
వేగాస్‌ను చూసి
ఇంద్రుడు తలవంచాడు. 278

వేగాస్‌లో
ఏమైనా చెయ్యొచ్చు
ఏమిటని అడిగితేనే
చెప్పడం కష్టం! 279

జూదం, త్రాగుడు
వ్యభిచారం
లాస్‌వేగాస్‌లో
మహాపుణ్య కార్యాలు! 280



అమెరికన్లు ఎడారిలో
అందాలు సృష్టించారు
లాస్‌వేగాసంటే
అదే మరి! 281

విశ్వమంతటినీ
వేగాస్‌లో చూడొచ్చు
ఒక్క
తాజ్‌మహల్ తప్ప. 282

జీవితమంటే
క్షణభంగురం!
వేగాస్
ఆగకుండా తిరిగే బొంగరం! 283

అందాలన్నీ
ఒక వేగాస్‌లోనే
తారకలన్నీ
ఆకాశంలోనే. 284

సౌందర్యానికి
వేగాస్ పొద్దుపొడుపు
ఇంద్రియాలకు
ఆటవిడుపు! 285

ఎవరి తిండ్లు
వారివే!
ఇక్కడి వారికి పిజ్జాలు
మనకేమో రొట్టెలు! 286

అమెరికాలో
ఆడ మగ తేడాల్లేవు
అర్ధనారీశ్వర తత్వం
బోధపడిందా? 287

ఒబామాను
కదిలిస్తే హెల్త్ కేర్
సెటిలర్స్‌ను పలకరిస్తే
వెల్త్ కేర్! 288



అమెరికాలో
అమరవీరుల బొమ్మలు
కీర్తికీ, స్ఫూర్తికీ
పట్టుగొమ్మలు! 289

మనమున్నాం
వందకోట్లు
అమెరికాను చూసైనా
దేశభక్తి నేర్చుకోవాలి! 290

నాటి సినిమా
మనోహరమైన కొలను
నేటి సినిమా
ఒక పెద్ద సునామీ. 291

గుఱ్ఱపు బగ్గీలలో
నాటి సినిమాలు
నేడు రాకెట్లు లేకుండా
కన్పించవు. 292

అధ్యక్షుని
శ్వేతసౌధం చిన్నదే
అధికారం మాత్రం
గొప్పదే. 293

ఉపనిషత్తులు
చదువుకున్నోణ్ణి
బీచీలలో
తిరుగవలసి వచ్చింది. 294

భరతనాట్యమా!
అదృష్టమంటే నీదే
ఇక్కడకూడా
తమదే రాజ్యం! 295

వాషింగ్టన్ను
అమెరికన్లు మరవరు
మాకు మాత్రం
నెహ్రూ గుర్తుకే రాదు. 296



ఇక్కడ దేనికైనా
కాగితమే
ఒకరోజు ఖర్చులో
నెలదాకా తినొచ్చు. 297

అమెరికా అంతా
పచ్చదనమే
శ్వేత సౌధం మాత్రం
తెల్లనిదే. 298

అమెరికా అంతా
తోటలూ, కోటలే
మన పొలాలనిండా
బీటలే. 299

ఐస్క్రీం ఎంత తిన్నా
తనివి తీరదు
అమెరికా ఎంత చూసినా
ఇంకా తక్కువే. 300

వైట్‌హౌజ్ ముందు
నిలబడ్డాను
శాంతి కపోతం
నా భుజం మీద వ్రాలినట్లైంది. 301

వాషింగ్టన్ పేర
మాన్యుమెంట్
చెక్కి నేలమీద నిలబెట్టిన
పెద్ద పెన్సిల్! 302

పాలకులకు
వాషింగ్టన్ డి.సి.
వ్యాపారులకు
న్యూయార్క్ సిటీ బిజీ. 303

న్యూయార్కులో
ఎత్తైన భవనాలు
ఇక్కడే ఉన్నాయి
పద్నాలుగు భువనాలు! 304



కాగితాన్ని చింపి
రోడ్డుమీద వేశారా?
వెయ్యి డాలర్లు
కట్టాల్సిందే. 305

అమెరికాది
ఎంత అదృష్టం!
రెండు సాగరాలు
దాన్ని భుజానికెత్తుకున్నై. 306

'స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ'
చేతిలో చిన్నదీపం!
ఐనా
అమెరికా అంతా వెలుగే. 307

అమెరికా
ఒక అందమైన పూవు
కాని
ఆధ్యాత్మిక సుగంధమే కరవు. 308

డబ్ల్యూ. టీ.సి
డౌనయ్యిందా?
లేదు, త్వరలో అది
కొత్త ఊపిరి పోసుకుంటుంది. 309

నయాగరాను
చూడకుండా ఉండిపోకు
ప్రకృతి ప్రియులకది.
నయా ఘర్! 310

అమెరికా మనల్ని
ఎత్తున నిలుపుతుంది
లాస్‌వేగాస్ మాత్రం
మత్తులో ముంచుతుంది. 311

అమెరికా
పెద్ద ట్యూరిస్టు కేంద్రం
నా భారత దేశం
సమస్యల సంద్రం! 312



అమెరికాలో
ఏ నగరాని కా నగరమే సాటి
ఐనా
న్యూయార్క్ మేటి! 313

అమెరికా
మాంసాహారులకు నాకం!
శాకాహారులకు మాత్రం
శోకం! 314

బాబూ!
నీకు సహనశక్తి లేదా?
ఐతే
అమెరికా రావడం మానెయ్! 315

తెల్లవాడు
ప్రపంచాన్ని జయించాడు
అమెరికా
దారిద్ర్యాన్ని జయించింది. 316

మనదేశం
ఎలా వుండాలో తెలియనప్పుడు
నాయకులకు
టూర్లెందుకు? 317

తన దేశంలో
ఎంత గొప్పవాడైతేనేం?
ఇక్కడ
క్యూలో నిలవాల్సిందే. 318

ఇక్కడ
ట్రాఫిక్ రూల్స్ కఠినం
నల్లవారికే
జుల్మానా లెక్కువ! 319

డాలర్‌తో ఏదైనా
కొనాలనిపిస్తుంది.
కాని రూపాయ
వాణికిపోతుంది. 320



ఇక్కడ సాధ్యం కానిది
ఏమీలేదు
చక్కగా
చుక్కలందుకోవచ్చు. 321

అజనాభ దేశంలోనే
స్త్రీలబలలు
అమెరికాలో మాత్రం
సబలలు! 322

ఇక్కడ
మీడియాను గౌరవిస్తారు
మనదేశంలో
పీక నులుముతారు. 323

న్యూయార్క్ నగరాన్ని
చూశాను
నాకు వ్యూసే కాని
న్యూస్ దొరకలేదు. 324

అమెరికాలో
ట్యూరిజం భేష్
మరి భారత్‌లో అంటారా
వట్టి యాష్! 325

మార్గమధ్యంలో
రెస్టేరియాలుంటాయి
కాని త్రాగటానికెవ్వరూ
నీళ్లివ్వరు. 326

గ్యాస్ స్టేషన్లలో
మనిషే కనిపించదు
పెట్రోలెంతైనా
పోసుకోవచ్చు! 327

గొప్పోడు
యుద్ధభయం పుట్టిస్తాడు
పైకిమాత్రం
శాంతిమంత్రం జపిస్తాడు. 328



అమెరికాది
పెద్ద భూభాగం
అందుకే గదా
దానికంత గర్వం! 329

ఓ టెడ్ కెనెడీ!
మీ నాన్ననే మరిపించావ్
అమెరికా
ముద్దు బిడ్డవి నువ్వు. 330

హెూలీ ఫాదర్‌కు
నీ లేఖ
మత ధార్మిక విచారాలకు
ఏరువాక! 331

ఓ టెడ్ కెనెడీ!
నీకెంత తపన?
అందరి చదువు పట్ల
ఆరోగ్యం పట్ల! 332

ఇక్కడ
దేశాధ్యక్షులే ఆదర్శం
మనం
మహాత్ములనే లెక్కపెట్టం. 333

ఈ దేశంలో
అదే నింగీ, అదే నేలా
కాని
సంస్కృతీ సంప్రదాయాల్లోనే తేడా. 334

నాదేశంలో
ట్రాఫికంటే భయంలేదు
ఇక్కడ మాత్రం
'కాప్' కు మోకరిల్లాల్సిందే. 335

అమెరికాలో
ఆయుధాలకు తక్కువ లేదు
వాడితే ముప్పు
వాడకుంటే తుప్పు. 336



*'కొడక్'లో
కాసేపు తిరిగాను
తారలు పాదాలక్రింద
తళుక్కుమన్నాయి. 337

'హాలీవుడ్'లో
అందాల భామలు
అమర గంగలో
బంగారు తామరలు. 338

కొడక్ థియేటర్లో
ఏనుగు గున్నలు
ఖైరతాబాద్ వినాయకుడు
గుర్తుకొచ్చాడు. 339

ఇక్కడా
నాకు పిల్లి అడ్డమైంది
చిత్రం! ఆ రోజు
అనుకున్న పని కాలేదు. 340

* హాలీవుడ్‌లో ఆస్కార్ అవార్డులిచ్చే థియేటర్.

ఇండియా
గొప్పదౌతుంది!
సాటిలైట్ సేవల్ని
ఉపయోగించుకోవాలి మరి! 341

ఇక్కడా మన అధికార్లు
తిరుగుతారు
కాని వచ్చిన పని
మరుస్తారు. 342

అభివృద్ధి మంత్రం
జపిస్తే లాభమేమిటి?
అది
చేతల్లో కనిపించాలి. 343

అమెరికా
చాలా తెలివైంది
ప్రపంచ మేధావుల్ని
వశం చేసుకుంది! 344